శ్రీరస్తు.

---

శ్రీకృష్ణపరబ్రహ్మణేనమః.

శ్రీవిష్ణుభక్తాగ్రేసరుఁడగు

వరగంటి శేషగిరిదాసుగారిచేరచియింపఁబడిన

# శ్రీహరికీర్తనలు.

---

ఇవి.

శ్రీహరిభజనపరులకు

సత్యంతోపయుక్తంబుగనుండునట్లు

మద్రాస్వామింపిళ్ళయనుమతిఁబొందిన

శ్రీరంగనాయకీవిలాసముద్రాక్షరశాలాధికారులచే

ముద్రింపఁబడియె.

---

NELLORE.

SREE RANGANAYAKEE VILASUM PRESS,

*Ranganayakulapett.*

1892.



శ్రీ రా మ

# హరికీర్తనలు.

ముఖారి ఆది.

శ్రీరామ రామయనుడీ॥ శ్రీరమణుని జనులు బొగడుడు॥ తనువస్థిరమని దలపోయుచు మదిఘన సుజ్ఞానముగలిగి । దినదినమచ్యుత దివ్య కథామృత మనుభవింపుచును చెలగీ ॥౧॥ వాసిగ శ్రీహరి దాసుల బొడగని దాసుడనని మ్రొక్కుచును । శ్రీశుని కథ లన్యోన్యులు జెప్పుచు కీర్తిగంతులు వేయుచును ॥౨ శ్రీ॥ శ్రీకర తాళ మృదంగరవంబుల శ్రీశునిభజయింపుచును । హాకల్యాణ గుణాఢ్య హరేయని హరి కెకోలని బిల్చుచును॥ ౩ శ్రీరా॥ ఘన విషయంబుల వెనుకొనుచిత్త మునువనజాక్షుని కెచ్చుచును। ఘనమతి గుపుచును దిరుగుచు నిలుచుచు మునుమున హరిబొందుచును ॥౪॥ స్థిరముగ సంగప్రసంగంబున వెలయుచు శేషభటునిపాలించి । మెరయుచునుండెడి హరిసేవించుడి మితములేక భజియించీ॥ శ్రీరా॥

సురట రూపకతాళం.

శ్రీవరప్రసాద। నను చేరి బ్రోవరాద ।వాదా।
శ్రీకరుణామృతంబుసోకసేయవేమిసామి ॥
కోరికోరి నిన్ను మదులుగొంటికొంటి శరణటంటె
సూరిజననవాంబుజాకర వీరధీరవిబుధశుభద ।౧॥

భూతజనక వాసుదేవపూర్ణ చిత్స్వరూపనృహరి॥
పూతహృదయబ్రోవుమీప్సితదోషవినుత శేష॥౨॥
వరదరంగవాస శేషగిరిభట్టప్రపోషయోగి।
వరమనః పయోధి వాసదురిత బహుళగహనదహన॥శ్రీ॥౩॥

ధన్యాసిరాగం ఆది.

పరమ పురుష నారాయణకృష్ణ-పద్మనాభ గోవింద । పురుషోత్తముదామోదర శ్రీధరపూర్ణానందముకుంద ॥ నిత్యుడవజుడవనంతుడవమలుడవత్యనుపమచరితుడవు। సత్యముసత్యముపూర్ణగుణుడవుభృత్యాంతఃకరణాలయుడవు॥ ఇందిరేశ నేనిభవజలనిధిజెంది వసింపగజాల । పొంపుగ నీకరుణామృతరసమున పోషణసేయవదేల॥౪॥ సాక్షాన్మన్మథమన్మథరూపముసాక్షాత్కారము జేసీ।పక్షీంద్ర ధ్వజ పాలింపుము నాపక్షంబగుచునుజూసియేకృపను కరివరుపైనుంచితో యాకృప నాపైనుంచుమేకృపమును ద్రౌపది పైనుంచితో యాకృపనాపైనుంచు॥ యేకృపచేప్రహ్లాదుని బ్రోచితో నాకృపచేపోషించు। యేకృపతోడ విభీషణు బ్రోచితో యాకృపచేపోషించు ॥ యేక్రియవిదురాక్రూరులబ్రోచితో యాక్రియనను పాలించు। యేక్రియశంతనపుత్రునిజూచితో యాక్రియచే వీక్షించు॥౬॥ అంబరీష రుక్మాంగదార్జునులవెంబడించికరుణించు । కంబుకంధర యాకృపనాపైనినిజంబుగనికగలిగించు ॥౭॥ తక్కినభక్తులమునులను వల్లవతరుణీ జనవర్గమును । యెక్కుడు ప్రీతినినెటుగంటివానన్నక్కరనటుగనుమికను ॥౮॥ ప॥ చరణభటుల దురితములనడంచెటిదొరవనినినువిన్నాను। కరుణింపుము శరణంటినినాకికగతినీ వనుకున్నా

ను ॥పర॥౯॥వలచితినగుమొగమిందుకజూపుమువాసవముఖసురపాల
చెలువుడవనుకొనిబిలచినపలుకవుజలజనయనయలుకేల॥

కరుణతోడశేషాఖ్యసేవకునిగాచినరంగనివాస । పరిపాలింపు
ముగనుపిడ నాడక పద్మాభూ హృద్వాస ॥ పరమపురుషనారా
యణకృష్ణపద్మనాభగోవింద॥

ధన్యాసిరాగం ఆది.

మాటికీనీపెట్టుబోకువేమనసాసాటిలేనిహరిబాసి।
ఓటులేని వైరాగ్యపదవిగొనుసూటిగమోహముగోసి॥
లలనలపెదవుల వలపునతేనియగలదని భ్రమయకుసుమ్మీ।
తెలియనచటనొక కాటానరించిన వెలువడు రక్తముసుమ్మీ। ౧
సఖియలచనుగవగని భ్రమయకుమాంసపుఖండములనుకొమ్మా।
సుకరమనకుమరునిలయమునెంచగసూటిగదుర్గంధమ్ము॥మా॥౨॥
ఇంతులుపుత్రులుసహజులు బంధులుసంతకూటమనుకొమ్మా।
చింతనొందకనుశ్రీహరిపదయుగసేవామృతమికగొమ్మా॥మా॥ ౩
నిత్యముగాదిదినిత్యముగాదిది నీరుబుగ్గదేహంబు।
సత్యము సత్యము హరిసంస్మరణముసన్ముక్తికిమార్గంబు॥౪॥
కరమరుదుగ శేషాచలదాసుని పరిరక్షించిచెలంగు।
వరరంగపురీశ్వరుడగు విష్ణునిదలచినభవముదొలంగు॥౫॥
మాటికినీపెట్టుబోకు॥

నాదరామక్రియ ఆది.

చందురుసుందరమెన్నెటినగుమొగమెందుకుజూపవురాధా ।సుం
దగపననీ కరుణామృతముగ తూన్పవెమన్మనబాధా ॥ చెలువుడవి
నునీనడ వడిదెలసెనుపలుకులేలపోపోరా। పలుమరునినువలచిన పాల

తులకడభాషింపగ నటుబోర ॥౧॥ గరితరో నీచ్చనుగవనెదగ్రుచ్చుచు కౌగిట జేర్పవెభామా ।పెరుచుగ మ్రొక్కెదనగమరలేటికి దాసు డబ్రోవవెలేమా ॥౨॥పొందుగవిరిబాన్పున ననుజెనగకనెందరికిలవిర నిన్నా । సుందరాంగ దెలసెను నీతనుగతచందనమును గనుగొన్నా ౩ ॥ కలదటె నిన్నెడబాయుట నీహృత్కమలంబున డాగితినీ। బిలువకున్న రానైతిని చందనమలదిరిభక్తులుతమినీ ॥ ౪॥ జగములనన్నిటిగ లిగించెటి నెరజాణత్వము జూపకురా । జగదీశ్వర నీమోవినిదంతక్షత మేపడదు సేలనురా ॥ ౫॥ సకియరో జగదీశుడనై వలపునశరణంటిని గదెనిన్ను। శుకమధరముబింబంబనిచీరెనుసారిది జెరియుననన్ను ॥౬॥ హరిహరి దేహముబోలుచు హృదయంబా యనహహ మలినంబు॥ అరుదుగ నీపైవలపులుజనులకు నడవిగలయుమాగణంబు ॥౭॥ ముదితరో సొగసగునగు మొగమునవోకము ద్దోసగ వెగుణధామా । మృదుతరమధురాధర సుధచేనను మొనసి జెనుపగదేలేమా ॥౮॥ ననుపడనాడకుననువిడనాడకునారాయణగోవింద। మనసిజశత మోహనము కేళినిఘన కృపనేలుముకుంద ॥ ౯ ॥ వరరంగస్థలవాసుడ శేషాహ్వయభటపరి పాలుడను । సరసిజగంధిరో ననుగూడుము శ్రీకరసంపదలొదవగను॥౧౦॥

శహనరాగం ఆది.

శ్రీరమాహృదయ సంచార రార। సారస్వరూపనా సామిరార,
క్షేమలనీకరుణనాపాలరాదో।బాలగోపాలనన్నేలరాదో॥౧॥
మందరోద్ధరణనీపొందుచాల। డెందముగా రెరావిండదేల॥౨॥
కారుణ్యహృదయశృంగారవేష । వారితాఖిలసంసారదోష॥౩॥

## శ్రీ హరి కీర్తనలు.

నందప్రియాత్మజగోవిందరార । కందర్పమోహగుణబృందరార ॥౪॥

శేషసేవకపోష శ్రీనివాస । శ్రీరంగనాథయోగిచిత్తభాస ॥౫॥

కరహరప్రియరాగం అటతాళము.

మాటాడరానినుమదిలోవలచితి। మాటికినిను నేమరినమ్మినానురా॥ప॥

నీమోము జూపరనిజదాసవరద।శ్రీమీరనిను నే సేవించినానుర॥అను॥

పతగేంద్రవాహనప్రభుడవీవని నే ।బలిమాలితిభూభారవిదారణ ॥౧॥మా॥

భవ్యసుందరవేష భవదీయదాసుడ నవ్యపదాంబుజనగధర గిరిధీర ॥౨॥మా॥

సురరాజ వందితచరిత:మాధవశ్రీ । కరుణార్ణవ యీకారిన్యమేలర ॥౩॥మా॥

ధరశేషదాసుని దగిలిబ్రోచెటి శ్రీ కరరంగవాసనా కామముదీర్పర॥ మాటాడరా॥

బ్యాకురాగము ఆదితాళము.

చూపరస్వరూపము, నైన నేనుయీతాపము॥పల్లవి॥

తాపసవరదకృ పాపరిపూర్ణనుపాపరాధినని మరి వేడితి ॥అను॥

నీరజాక్ష శ్రీలోల, నినుజూడ...ర్వజాల।

సారసభవనుత చరణకమలయుగ।

కోరికోరిగనుగొననినువలచితి ॥చూ॥౧॥

మేలనాపైకోపము, మెట్లుబాతు యీపాపము,

కాలజలదఘనకాయమురాంతకకావుమనుచునిను ఘనునివరించితి॥ ౨

కోరితినభయము, చేరిమాన్పునాభయము,

ధీరశుభదరంగేశ శేషభటవారిజాక్ష సురవీరపరిపోషక॥చూ॥౩॥

కేదారగౌళ.

యేరాయిటురారా। వారణాపన్నివారణా॥పల్లవి॥

చాలసినుభజించితి । యేలర। కోపమేలర॥అను॥

దానవేంద్రవిదారణ । మానరదయబూనర॥౧॥

సృష్ట్యాద్యతికుశల । దుష్టుడ। బహుకష్టుడ॥౨॥

కాలమేఘాభశ్రీధర । పాలక। ఘననీలాలక॥౩॥

వాంఛజోదరకేశవ । తారణా।దోషవిదారణ॥

బ్రోచుటకుమదిని। తోచెనా । నీకుయోచనా॥౪॥

శ్రీరంగాలయశేషా। ధారకా। గోపకిశోరకా॥౫॥

నాదరామక్రియ.

నారాయణవిధివర॥ నారాయణ॥పల్లవి॥

శ్రీరమణీశసద్గుణవితాన॥నారా॥అను॥

గాధిపుత్రసవనమెలమిగాచిఘనువుద్రుంచియుం।

వేధాహరుతాసాసన।వింతగ నెంతయునింతి బెండ్లాడిన॥నా॥౧॥

మునిగణంబులెల్లమదిని మోదింపగదయతోడను;

ఘనదైత్యావళినటవిని । గాసిలజేసి వినాశమొనర్చిన॥నారా॥౨॥

కరివరేణ్యుడార్తి వేడగాంచిమకరి ద్రుంచియుం।

పరిపాలింపవె కరుణను భక్తినిముక్తినిభక్తునికిచ్చుచు॥నారా॥౩॥

తామసుండ దుర్జనుండ పామరుడ దురాత్ముడ।

శ్రీ హరి కీర్తనలు.

స్వామినాకేమికగతి చక్కగమక్కువ నక్కరబ్రోవుము ॥నా॥ ४॥
వరదరంగనాథ శేషగిరిభటావనాచ్యుత।
కరుణార్ణవపురుషోత్తమకంజపదసుందర మందరగిరిధర। నారా॥

రాగం.

హరినినీవు సేవించుగురినీ। మనమ। హరినీ। పరుసీ ॥ప॥ ఘనయోగని ష్ఠనుమునులు దలంచెడివన జదళాత్మువరించవె। సుఖముగాంచవె। మించవె। అ॥ భవజలనిధిబడి బడలనేల నింకనవనీతచోరునిగూడవె। భయముపీడవె వేడవే॥ ౨॥ మానసమావిన వేనందనందనుగానముసేయు చుసౌఖ్యము। భవముచెక్కుమ। మ్రొక్కుమ ॥3॥ గరిమతోడుత శే షగిరిభటునేలిన వరరంగనాథునిరమ్మనె। అభయమిమ్మనె। కొమ్మనె॥

కమాసురాగం.

సుందరాంభోరుహాక్ష। హితరక్ష॥ పల్లవి॥
మందహాససుందరాస్యవర గోవింద దేవబృందవందితాచ్యుత। సుం॥అ
గోపవేష పాపశోషఘనసంతాపహరణపాపమికనుబాపుము। ౧॥
బాలగోప బాలచాలబ్రోవకజాలమేల తాళజాలనేలర। ౨॥
వీరధీరచారుహారనతపరివారశూరఘోరవైరిఖండన। 3॥
వద్దువద్దుపద్దదేలతద్దయువద్దజేరిముద్దొసంగుముద్దుగ॥४॥
భోగిశయనయాగఫలదభవ్య విరాగయోగి భాగధేయముక్తిద॥ ५॥
రంగనిలయమంగళాంగహితమునిపుంగవాంతరంగసంగకేశవ ॥౬॥
సుందరాంబోరుహాక్ష॥

# శ్రీ హరికీర్తనలు.

## ఝంజోటి చాపు.

పంకజాక్ష। హరే। పంకజాక్ష॥పల్లవి॥ బ్రోవవదేమి నేరమో।
కోపమా । హరేపంకజాక్ష॥అను॥

దేవదేవ సుప్రభావనమ్మనుచును యెవేళబిల్వరా విదియేమినేర
మోకోపమా ॥౧॥

దుష్ట మదజాననన్ను కష్టపెట్టకు మన్ననిష్టముతో బల్కవిదియేమి
నేరముకోపమా॥౨॥

కామమోహనవేష మోముజూపుమని యెమివేడిన బల్కవిది
యేమినేరమో॥కోపమా॥

పొలుపుగ శ్రీరంగపురమున వెలసినన్నేలమి కన్నులజూడవిదియేమి
నేరమో। కోపమాహరే పంకజాక్ష॥

## బ్యాకు రాగము,

కరుణాన్వితచిత్తకమలా కమలాకరుణజూడవే॥

నిరతము నీచరణయుగళము నిష్టతోమతనుదలంతు
నేపరులవేడుట నిరసింతు। నిన్నెగాంతు। కరు॥

మాతండ్రియగువిష్ణుదేవుని వేడిన మన్ననతోడబ్రోవండు।
ననుకన్నెత్తినైనచూడండు। పలుకండు॥కరు॥

మంచివేళను హరిగాంచి నాగతిమందలించవేతల్లి మాయమ్మ।
నెనరుంచినా కభయమీవమ్మ। బ్రోవవమ్మ॥కరు॥౨॥

గానకోని బిడ్డలఘోరముతల్లికి మనసున దెలియదటమ్మ।
నేమనవిసేయగనేలనమ్మ వినవమ్మ॥కరు॥౩॥

జనకుమువుతునికోపించి కొట్టగజననియడ్డమురాదటమ్మ।

నీకుకనికరమేలలేదమ్మ। పల్కవమ్మ। కరుణాన్వితచిత్త॥

రాగం.

నావశమానినువినుతింప ॥ భావితాంగకేశవగోపాల శ్రీవరబ్రో

వుముదయయుంచీ॥ పల్లవి॥

కోమలత్వమున వెన్నలుబ్రుచ్చిలి। కోరివెలందులశిగ్గలబుచ్చి।

భూమిపతులనందరనిర్జించి। కామినిరుక్మిణిగైకొనలేద॥ అనుపల్లవి॥

నిరతముసజ్జననివహములెల్ల। పరిపరివిధములప్రార్థనజేసి।

వగదహరేయనిస్మరణయొనర్ప। కరుణింపలేదాకరుణాంభోధే॥నా॥

దేహసుఖమ్ములతెరవులుమాని। మోహరహితులగుమునులనిశంబు

మోహనాంగనీమూర్తినిజూచి। మోహింపలేదాముచ్చటదీర॥నా॥

కామితదాయకకంజదళేక్షణ। ఘనకరుణనునను బెనుపరాద॥

శ్రీమత్పదయుగరంగపురస్థిత। నామదికామముప్రేమతోనిమ్ము॥నా॥

ధన్యాసిరాగం.

రెణ్ణాళ్లనటనవినుడిది॥ పల్లవి॥

చెన్నుమీరు మిద్దెటిండ్లుసొమ్ములుమెన్నరానిధనమునగనిమురియకు॥

దేహపుష్టివయసుసొగసుకుబ్బకుసాహసమునసుజనులభువిజెరచకు॥

రెణ్ణాళ్లనటన॥

మిక్కిలిసుఖభోగంబులుగలవని చక్కనినెలతుకసతియనిపొంగకు॥ రె

ఇలనధికారము గలదనిత్రుళ్లకుబలిమినన్యయువతులతమిగలయకు॥ రె

వస్తువితానములిస్తువగలదని దుస్తరమోహాంబుధి బడిమిణుకకు॥ రె

వనితాస్రక్చందనసౌఖ్యంబుల ననయమువెలయుటఘనమనియెంచకు॥

రెణ్ణాళ్లనటన॥

కనికరమున శెషా శ్రితునేలినఘనరంగస్థలిగలహరిదలవుడి॥ రె॥

ముఖారి.

భువినేద్రావినచనుబాలు। బోలునుసప్తసముద్రాలు॥పల్లవి
యిలనేనెత్తినజన్మాలు। యెన్నికబొందవనంతాలు॥అనుపల్లవి॥
యింకానీదయరాదుగదా। యిందిరేశకరిరాడ్వరదా॥ భువి॥ ౧
శ్రీరమణీశ్వరగుణబృంద। చేరుమునసుదయాగోవింద॥ భువి॥ ౨
పాలితమునిగణగోపాల । పద్మవిలోచనశ్రీలోల॥ భువి॥ ౩
శ్రీరంగస్థితమధుహరణ। శేషభటార్చితశుభచరణా॥౪॥ భువి

రాగం.

ఉండేమిరాయుడకేమి॥పల్లవి॥
దండిగవిష్ణునాత్మదలచిపూజింపనివా॥ డుండేమి॥ అను
కరుణాసముద్రుడైన। శ్రీహరిసేవమరచిధారుణిలోన।
పరభామలనుగోరిధరసంచరించుదుష్టు॥ డుండేమి॥
శౌరికథలువినక। దాసవర్గమును జేరిభక్తిబాగడక॥
ఘోరపాతకములు గోరిచేసెడిఖలు॥ డుండేమి॥
వరరంగధాముడగుచు। శేషధీరునిపరిపాలనముసేయుచు॥
గరిమశోభిల్లువేల్పునెరుగకుండెడిమూఢు॥ డుండేమి॥

రాగము.

ఏమియెరుగనమ్మతల్లి యేమియెరుగనే॥పల్లవి॥
భామలెల్లనన్నుపొంచి। పట్టను కొట్టను తిట్టను దాసిరి॥
వెన్నదిన్నదొంగయనుచునన్ను బట్టిరె॥
వెన్నలెరుగనన్న నన్ను కన్నుల సన్నల చిన్నెల సలిపిరి॥ యేమి॥ ౧

బోటిమొకటిగోటనన్ను కాటానచేరనే॥
గోటికాటుకేద్చుచుండ మాటల పాటల యాటలమాన్పెను॥ యేమి॥ ३
ఆడిపాడుమనియొకతురవేడసాగనే॥
ఆడనేరనన్న వేడ్క ఆడుచును పాడుచును వేడుచునుగూడిచను॥యేమి
పువ్వుదీగెతోడగొట్టిహాలతిడాసెనే॥
దవ్వుదవ్వులకనుబోవ। నవ్వులను పువ్వులను రిఫ్వనను రువ్వెనను॥యే
రంగనాథరమ్మటంచుపాంగిబలికెనే॥
సంగరహితయోగిపోష।శ్యామాభిరామానీపే రేమనిపల్కిరి ॥ యేమి

కమాజు.

కాంచనచేలహరేనతసుఖద॥ కాంచ॥పల్లవి॥
ప్రాంచితా రుణా ధర ధరా పర దయా పర॥శ్రీకాంచన॥
సీసదా నిప దసా పమా గమా పద॥ శ్రీకాంచన॥
నీవ్వాడనుగ్రోవందగుశ్రీవల్లభ సేవించితిగుణాభరణ॥శ్రీకాంచన
నిసానిధ దానిధప మధామగ సమాగమపద॥ శ్రీ
వరమతులగుబుధులు పరమునినినుదలచి దురితములణతురు॥కాం
పమగనుపాపధనిధపమగగమా సనిధనిధపధని॥ శ్రీ॥
చరణఫయోరుహాయుగము నిరతమునామదినిడుము సురదేవజగత్ప్ర
భో వందితనాగదఖరరిపువారక భవవిధివర॥ శ్రీ॥
నిసానిసనిధనీ ధనిధప ధా పధపమపా ససమమమపసపాధధధ
నిసనిస నిధపధపమపనిపధని॥ శ్రీ॥
శ్రీకరపద మణిమకుటభయా పహావిజయసఖసుఖదా స్మితమృదుభా
షాద్భుతమధుశోపా శ్రితపరిపోషా ధృతశుభవేషా నిరంతరరంగ పు

రక్షితునిన్ను మదిన్నినుతింతుసుఖతనునీ విజ్ఞానముగానము ధ్యానము
హానముస్నానము మానకభిమానమతిని గనియొసగుము శరణంటినిక
నికరమలరం ననుగనుగొనుమిక॥ శ్రీ॥

నినిధ ధపపమగగమా పధనిధమాగమపధసీసమగససాసా సరిస
నిసీనీ నిసనిధధాధా పధపమపాపా సమమగపాప మధాధవనిన్నిధ
రిరినిసాసావిసనిధపామాపమ సాధప దానిస నిసని । సారిస ; రిసం
సానిధపమాగమపధనిసనిరిసాసరినిసధనిపదమా । ధపమగమపధని।

కాంచనచేలహరే

కోరికోరితిని దాసదాస్యం కోరిసేయతే పాపాబ్ధినశ్యం దీనుడాశేష
దాసునికి సంగడీడవనిరంగనాధ శేరినినున్నమ్మితిని। సారిసాపిధనిసాని
ధపా పాధనిసా మాపామగమా మాగమపామపాధాపనిధనిసారిస
రీసరిసానిధమపాధ॥ కాం॥

దేవగాంధారిరాగం.

భజగోపరిపాలం। అయిచేతో। భజగోపరిపాలం॥పల్లవి॥

నిజఘనవిక్రమనిర్జితశిశుపాలం । సుజననిషేవితసుందరగోపికాలో
లంభజగోపరిపాలం॥

కరధృతధరణీధరమఘువిదారం । కరుణారసపరిపోషితనిజపరివారం॥
వరజలకేళీగతలలనాంబరచోరం । పరిఖండితదుర్ధరధరణీగురుభా
రం। గిరిధీరం॥భ॥

ప్రకటితనిఖిలనిగమనికరాంతవిభాసం। సకలభువనభవపాలననిలయ
విలాసం।శుకశౌనకసనకసనందనహృద్వాసం। వికచాంభోరుహదళన
యనంశుభహాసం । సువిలాసం॥భ॥3॥

అతులితజవబలలలిత విహంగతురంగం॥
సతతకరాబ్జస్థితపటుచారురథాంగం।
కృతరంగస్థలవాసముఖండశుభాంగం।
శ్రితశేషాచలకృతబహుదురితవిభంగం। హితసంగం ॥భజ॥

యమునాకళ్యాణి.

అహన్యహన్యభిసేవే శ్రీరమణాబ్జోపమచరణౌ।పల్లవి॥
సనకసనందనమునిగణమానస వనజాంతస్స్ఫురితౌ।
ఘనల క్ష్మీకరకమలలాలితౌ కాంచనమణిమంజీరోపేతౌ॥౧॥
సలలితయమునాతటనీ చంచత్పులినోపరినటనౌ।
జలజాంకుశముఖలక్షణ భరితౌధళద్ధళౌ సత్ఫలదౌశుభదౌ॥౨॥
కుటిలభుజగపటుబలనిర్దళనౌ కుత్సితశకటహరౌ।
స్ఫుటచందనతులసీదళమహితౌ । భువననుతౌ।సచ్చరితౌ। అజితౌ౩ ॥
అతికలుషాన్విత శిష్య భటో్గ్రమహాదురితాబ్జగజౌ।
సతతానంగప్రదరంగస్థలచలద్ధగద్ధగనఖశశికలితౌ॥

యమునాకళ్యాణి.

శ్రీమాధవచరణౌ। శరణంప్రజామినిత్యం।పల్లవి
కోమలాంబుజసుందరౌ । కుత్సితగిరిపవిసన్నిభౌ॥శ్రీ॥అను॥
యమనియమాద్యనుపమయోగాన్వితవిమలమునీంద్రకరాచిరితౌ।
కమలాకమల భవేశ్వరశక్రప్రముఖాఖిలహృదయేప్సితౌ॥శ్రీ౧॥
నిజభటనికరోత్కటపటుదోషవ్రజనీరజవనవారణౌ,
గజరాట్ప్రాణావనకారోద్యద్గమనోత్సవజితనైపుణౌ॥శ్రీ॥౨॥
కుసుమిత బృందావనకుంజాంతవిశదస్థలవిభ్రాజితౌ।

ప్రశమితవిపదా । భక్తవిభవదా పండితవరగణబహుప్రదా॥శ్రీ॥౩
శేషదాసకృతదురితవిభంగా శ్రీకరరంగస్థలసంగా।శోషితవిమలా॥
సుభగాసలలితఘోషకుటీరప్రచయగా॥

బిలహరిరాగం.

ప్రకటాసురభంజన। మాంపాహి।పల్లవి॥
ప్రకటనిర్మలచరితయోగివ్యాపక
దీపక। ప్రాపక। గోపక। సుకరవిధిభవదైవపోషక॥ప్ర॥అను
రంగనాథగోపాంగనాపోష। రమ్యగుణగణచారువేష।
శృంగారభూష। శుభకరభాష। సూరివిమతగణశోషహితతోష।
మంగళప్రదశ్రీధర । మహితకరధృతభూధర। సంగహీనకృపాకర।
సర్వేశ్వరనారాయణ॥ప్రకటా॥

భైరవి.

చిన్ననాడెనాచేయిబట్టినకృపనెన్నదరమెవర్లద॥పల్లవి
నన్నుతాంగనారాయణకేశవనన్నుబ్రోవుమనివిన్నపమొనరుపగాచి॥ అ
గురుసఖనాథులకరణిజనకక్రియచరణసేవకులను చయ్యనగాంచి।
కరుణాన్వితహృదయంబునబ్రోచెడిపరమపురుషభవభంజనమాధవ॥౧
నినునెరనమ్మితినినువిడువకుమిక। ఘనరంగేశ్వరకమలదళాక్షు।
మనసిజసుందరశేషభటస్తుతవననిధినిలయగోవర్ధననగిరిధర॥చిన్న॥

శ్రీరాగం.

తన్నేటప్పుడుయమకింకరులు తనలోతనకేతెలసీని, పల్లవి॥
వంగుండబెట్టికూచుండబెట్టినిలుచుండబెట్టి॥తన్నె॥కాలంజేతం॥త॥
నిగనిగమెరసెడినగుమొగములుగలపొగసగుమగువలదగిలితివేమని।త

ఆటలపాటలమాటలమీరినపాటలగంధులతో టిపనేమని॥తన్నే॥౨॥

ఒంటరిగన్నవాల్గంటులుజనవెన్నంటికుచంబులనంటితివేమని॥త॥౩॥

హరిపదభక్తులదురితవిముక్తులధరకరతినోక్తుల వెరపించితివని ॥౪॥

లంచమునమదినాశించుచున్యాయంబెంచకదీనులముంచితివేమని॥త॥౫

చంద్రధృక్తినికాంచనవసనుభజించకవేశ్యలపంచనుంటివని॥త॥౬॥

మెక్కుచుసొక్కుచు నిక్కుచుదిరిగితివక్కటమిక్కిలిమ్రొక్కవుహరికని॥తన్నే॥౭॥

ధనమణివనితాద్యనుపమసంపదలనుమీరుచుహరిగనగోగవనుచు ॥౮

శ్రీలలనాధిప శ్రీరంగేశ్వరచాలబ్రోవుమనియేలవేడవని ॥తన్నే॥౯॥

ధన్యాసి.

శ్రీమద్రఘుకులసింధుసుధాకరచేరికావవయ్యా॥పల్లవి॥
రామపయోదశ్యామహరేరఘురామ బ్రోవవయ్యా॥శ్రీ॥అను॥
సకలసస్య పూర్ణంబగువసుధాచక్రమునేలుచును।
ప్రకటకరుణశరణాగతులగాంచుచు భాసిల్లుమువిలను॥శ్రీ॥౧
కామముఖ్యతస్కరులస్వజ్ఞానమహాధనము।
వేమరుదొంగిలిరికశిక్షించియెవెసనిమార్గధనము॥శ్రీ॥౨
నీస్వరూపమహిమము దెలిపించియునిర్మలమగుదయను।
నాస్వరూపధనమికకృపసేయుము న్యాయమార్గమునను॥౩॥
భవరోగంబులజిక్కుచు ప్రుక్కితిబాగుగనను గాంచు।
సవనావనసీస్మరణౌషధమునచక్కగసవరించు॥శ్రీ॥౪
వరతటాక గోపురమంటపములు హరిమందిరములును।
ధరనమరింపనిమూఢుడనెంతయు ధర్మవిరహితుడను॥౫॥

గరిమనీలనీరదదేహంబునకాంతియుక్తమగుచు।
మెరుగుతీగెబోలినవస్త్రముచేమెరయుచువతియగుచు॥౬॥
నీగుణరూపములను లెక్కింపనునికరుణాంబుధిని।
బాగుగనింతప్రమాణంబనగను బ్రహ్మయోపడవని॥౭॥
వలపులనదులమహాప్రవాహములువారకనెప్పుడును।
చెలువుడసుందరవార్ధివైననినుచేరునుచెర్చ్యైరను॥౮॥
నీదయయనుదూతికచేకుశలము నెమ్మివ్రాసిపంపు।
నీదయగోరెడినాపత్రికవిని నెరినను పోషించు॥౯॥
శ్రీకరరంగనివాసమురాంతక శేషదాసపోష।
వీకనిన్నువర్ణింపగతరమే వివేకసాధుపోష॥

పున్నాగ.

పాపబుద్ధులు బోడమింపకు ॥పల్లవి॥నీపైబుద్ధినికదొలగింపకు।
పాపకృత్యములకు పాల్పడనివ్వకు। పాపముసేయింపకు।బడలింపకు।
పాప॥అ॥
ననుబ్రోవవరదరమ్మంటిని। నిన్నునయముమదినమ్మికొంటిని।
ఘనవిపద్గాఢాంధకారములణగింపుమినదీ ప్తననుబెంప।కరుణింపు ॥౧॥
వడిదాసికృపనుచేబట్టుమి నీకడకంటనునుగని పెట్టుమీ।
విడనాడబోకు మివిధిముఖసురపాల।వేడెదనినుచాల।వినుతశీల॥౨॥
ధరణీరమాప్రాణనాయక। సుందరజితనవపుష్పసాయక।
వరరంగనాథ శేషాఖ్యసేవకుడను। వనజాక్షనీవాడను। వలచినాను॥

బిలహరిరాగం.

ఏదోవకచింత।యీసంసారమెంతజేసినకొంత।యీప్రాణికి॥ ఏదో ॥

ఆదరణమున శ్రీ హరినిదలంచనివారి| కేదో॥ ఈప్రాణికి తనభామ
వంటి సొమ్ములులేవటంట। తనబిడ్డలేమిజెప్పినవినరంట|
తనకేమిపాడిపంటలు లేవటంట| తనతల్లిదండ్రులుధరనంధులటంట॥ ఏ

తనమేలుగోరుబాంధవులులేరంట|తనబిడ్డలకుమంచిమనువురాదంట
ధనమెల్లదొంగలుగొనిపోయిరంట తనమీదనందరికినివైరమంట॥ఏ॥౨॥

వసతిగల్గినమంచిబసలేదంట । బసలోన నీరుండే భావి లేదంట |
పసిబిడ్డలునూతిదెసబోమరంట| పాపిష్టిదైవముభాగ్యమీయదంట॥ ౩।

తనపెద్దలేమియాస్త్రీనిగూర్చరంట।తనవంటికేమొజాడ్యములంటెనంట
తనవారలెల్లముందుగజనిరంట | తనకేమోమదిలోనదడగల్గెనంట ॥౪

సరివారుతనసుహాస్యముజేసిరంట|పరులన్నమాటలచురుకంటెనంట।
పొరుగిండ్లతనభాగ్యదిరుగునటంట। తిరిపెమెత్తినసేమిదొరుకదటంట॥

తనపత్నికిని పుత్రధనములేదంట।ధనమెల్లవేశ్యకాంతలుగొనిరంట |
తనకువైద్యముసేయుఘనులులేరంట। ధనముండి సంతతితనకులేదంట॥

సతితనకెప్పుడుప్రతికూలమంట। సుతుడన్యభామలజతగూడునంట|
బ్రతుకుజీవనముగన్పడదాయెనటంట, వెదకినఁనాకకాసుజతపడదంట॥

అంభోగభాగ్యములందలేదంట|సతిజారవాంఛకుమతిబెట్టెనంట|
గతిలేనివారికిగల్గెసిరంట| మృతితనకెప్పుడుజతపడునొంట॥ ఏదో॥ ౬

ఒకనికిపెండ్లిగాకున్నదటంట | ఒకడుకారాగృహమొగిజెందెనంట। ఒకడెందు బోయినదెరుగమటంట। యొకడందరినిబట్టియూరక
గొట్టునంట॥౭॥

తనభార్యకిప్రుడుకనపొద్దులంట| కనిపెట్టిరక్షించేజనులులేరంట|
*తనకన్నిచిక్కులునానగూడెనంట। తనశత్రులెల్లపెంపునుబొందిరంట॥

తనజిహ్వ గోరుభక్షణలు లేవంట। ఘనుడైనప్రభువుమన్న నగల్గదంట।
తనయల్లుడతికోప తప్పుడటంట। తనబిడ్డనేమిగొట్టనొతిట్టనొంట॥౧౧
తనమంత్రులెవరుయోధులుగారటంట। తనరాజ్యమభివృద్ధినిబొందదంట।
తనదేశమెవ్వరుగొనిపోదురోంట। తనమీదపగరాజుదండెత్తునంట।౧౨
తనసొమ్ముకొల్లగదినిపోయిరంట। తనకున్నధనమెట్లుదాచుదునంట।
తనబిడ్డదూరదేశముచేరెనంట। ఘనరంగపతిదయగావలెనంట॥౧౩॥

రాగము.

హరినిభజించుటెన్నటికో॥ పల్లవి
శ్రీహరిపదాబ్జములుముద్దాడుటెన్నటికో॥ హరిని॥ అను॥
స్థిరభక్తిగలుగుటెన్నటికో శ్రీ ధరకృష్ణాయనివిష్ణుదలచుటెన్నటికో॥
విడువని స్మరణయెన్నటికోగోవిందపదధ్యానవిభవమెన్నటికో॥౨
మరులొందిగొలుచుటెన్నటికో ఘోర తరదురితాంబుధిదాటుటె
న్నటికో॥హరి॥౩॥
ఆశలడించుటెన్నటికో విష్ణు దాసులతోపొందుజేసుటెన్నటికో॥౪॥
ఆడుచుపాడుటెన్నటికో కను లాఖ్యునిమాటికివేడుటెన్నటికో॥౫॥
హరిమోముగనుటయెన్నటికో రంగ పురపతిసన్నిధిమెరయుటెన్న
టికో॥ హరినిభజించుటెన్నటికో॥

రాగము.

శ్రీకరగుణయుతునీ చారు యశోకమకంటివటె। పల్లవి॥
నీకరణినిమమ్ముసేయవెశోకరహితులగను।అనుపల్లవి॥
చందనకానవటె పరిమళచందనలేపసునికుందమకానవటె।
సుందరకంపముకుళరదునీ॥౧

మన్మథకానవటె।సాక్షా న్మన్మథమన్మథుని।
చిన్మయవిగ్రహుని। నిర్మలసన్మునిమోహనునీ॥౨॥
శుకసనకవినుతుని। గంటిరెశుకములారఘనునీ।
సుకపోలద్వయునీఘనకింశుకములారగనరే॥౩॥
చిరునగవుమొగమమ్మ। గళమునశ్రీకౌస్తుభమమ్మ।
చరణాంబుజములనుఝుళఝుళమొరయునందెలమ్మ॥౪॥
మందరగిరిధరుడే। సజ్జనబృందసమాశ్రయుడే।
మందారమవినవే నిత్యానందమహాత్మ్యుడే॥౫॥
తిలకమ కానవటె। మృగమదతిలకాంకితముఖుని॥
నలినీకానవటే। సేవకనళిననలినసఖుని॥౬॥
కమల ములను బోలు। చేరెడుకనుగవగలవాడే।
కమలావల్లభుడేవికసితకమలావళులార।
రంగపురీశ్వరుడే।నవరససంగీతప్రియుడె
సంగరహితహితుడే శుభసారంగవితతులార॥ శ్రీకర॥

దేశాక్షిరాగం.

శ్రీకరాచ్యుతవిముఖచిత్తజాడ్యస్థులకు
నీకథామృతరసమెనిఖిలౌషములు॥పల్లవి॥
అతిదురితమేహముల కతుల మేహాంతకము
సతతపాపాంధముకుచంద్రోదయంబు।
జతలేనిసంసారతాపజ్వరాంకుశము।
క్షితిపవిరహిత విషగజీవనౌషధము॥౧॥
వాసవార్చితదేవవరకథాహీనమను

శ్వాసకాసలకవనిస్వర్ణభూపతియు
రాసకేళి దక్ష రహితజ్వరాగ్నికివి
రాజితంబగు నట్టిరసభూపతియగుక॥ ౨॥
సుతవధూగృహస క్తశుద్ధవిషవాయువులకు
సుభగమైవి లసిల్లుసూతరాజీయం।
మితిలేనికామమద మేహాపైత్యంబులకు
నతిశిక్షసలుపదగునానందభైరవీ॥ ౩॥
గురుతరక్రోధస్వపరవిస్మరణలనెడి
తరుచుక్షుషక్షయకుతామ్రభస్మంబు
హరిపదధ్యానశూన్యాజీర్ణ వాయువుల
వరశిక్షమొనరింపవాతవిధ్వంసీ॥ ౪॥
శ్రీరంగపురనాథచరణభట శేషాఖ్య
దారుణాఘూఘూదిద్వంద్వజాడ్యంబుల్ ।
కూరిమినణంపవిషకోలాహలంబు శ్రీ
మీరురాజమృగాంకమేలిమౌషధము.

ధన్యాసిరాగం.

హరిపదపద్మస్థిరసద్భక్తులచరితము నడవడి వివరింతు॥పల్లవి॥
విరివిగకొందరువిష్ణుననంతునితరచితరచిచరితమువినుచుందురు॥హ॥అ
పరిపరివిధముల కొందరుకృష్ణుని పాడుచునాడుచువేడుచునుగరిమ
హరినిగనుపడుమని మ్రొక్కుచుమరవుమెరవుమరచిగొలుచుచుందురు॥౧
తరుచుగనేకాంతస్థలులనుకొందరుహృద్వీథినివారిగనుచు।
గరిమతోడకౌగిట హరిజేచుచువరద వరదశరణుశరణందురు ॥హ

హరిదినసద్వ్రతమమరరచింపుచు హరిపదతీర్థమ్ముగ్రోలుచును।
హరిపదభక్తులగలసినటింపుచు ధరణికొందఱరుదుజెందనుందురు ॥3॥
హరినిదలంచుక కన్నీరిడుచును హరియని యరచుచు నేడ్చుచును।
తరుణులు పురుషుని నెరివలచినక్రియ హరినిమరిగిమరిగి కొందరుందురు ॥
కొందరు విష్ణుధ్యానమజస్రము కోరిసేతురతినిశ్చయులై।
కొందరు విష్ణుడెయనియరచుచు కోరికోరి బిలచితలచినగుదురు॥హ॥
కామక్రోధాద్యరుల నడంచుచు శ్రీమద్విష్ణుభటులజేరి।
తామరసాక్షునితత్వమెరుంగుచు ప్రేమతోడస్వామినిజూడవలతురు॥౬॥
ఘనమతికృష్ణహసన్ముఖ దర్శనమనయముసేయుచుకొందరొగిం।
దినదినమచ్యుతదివ్య కథామృతమనుభవించిమించిసంచరింతురు॥ ౭॥
పరధనపరతరుణులమదిగోరక వరరంగపతినిమదిగోరి।
పగలక్ష్మీబ్రహ్మాద్యధిపుండనిహరినిపరుని ధరణినమ్మియుందురు ॥హరి॥

రాగం.

హరిభజింపరబరేబరే। శ్రీధరున్స్మరించరబరేబరే పల్లవి॥
విరించిజనకునివరించిబాగడుచుహరేహరేయనుబరేబరే॥ అను॥
పరాంగనలమదివరించియమకింకరాగ్నిబడకురబరేబరే ॥హ॥౧
శరణ్యుడగుకరివరేణ్య వరదునిచరిత్రములువినుబరేబరే॥హ॥౨
సుతాంగనాగృహవితానములుఅశాశ్వతంబుగావురబరేబరె ॥హ॥3
దురాశలనుదుర్దారాధములగొలువరాదు విడువిడుబరేబరే॥హ॥౪
ముదంబుననుహరిపదంబులనయముమదింభజింపరబరేబరే॥ హ ॥౫
ధనంబులనుభూషణంబులనుతుదిజనంగరావురబరేబరే ॥హ॥౬
నితాంతభక్తినిసతాంవరిష్ఠులనుతించుహరిగనుబరేబరే॥హ॥౭



ఘనంబనుచుదుర్జనంబులనుగనమనంబుబెట్టకుబరేబరే॥హ॥ా
నవాబ్జనేత్రునిభువింభజింపుచుభవాబ్ధిదాటరబరేబరే॥హ॥ా
దురాగ్రహంబునమురాంతకాప్తులద్దిరస్కరింపకుబరేబరే॥హ॥౧౦
భుజంగశయనుభజించుసుజనులభజించిమ్రొక్కరబరేబరే॥హ॥౧౧
సరోజనేత్రునివరాంఘ్రులాత్మనునిరంతరముగనుబరేబరే॥హ॥౧౨
మదాంధతను శ్రీహృదీశుదలపకతుదింజడకుమికబరేబరే॥హ॥౧౩
అపారనిర్మలకృపార్ణవునిమదిజపింపుచుండరబరేబరే॥హ॥౧౪
స్థిరంబుగాదీశరీరమునిరంగపురీశుగొలువరబరేబరే॥హ॥

రాగం

ఇప్పుడుగాకింకెప్పుడు శ్రీనాథాప్పానురక్షించేది। పల్లవి॥
మెప్పుగదీనశరణ్యుడవైనశ్రీయఃపతివనినినుతప్పకనమ్మితి। ఇప్పుడు॥అ
కష్టపడిభవమనజడనిధినుడిబడిదడగొనిమునుగుచుబడలగను।ఝుడియ
కునునిదడజెడవెనుసరచుచు। బడలికెలుడిగెమపలుకులుబలుకవు॥ ఇ॥
తెరుచుగకామాద్యరిషడ్వర్గముధరనతిబాధలబరుపగను। వరపకృష్ణ
పురుషోత్తమశ్రీమద్గరుడగమనరంగేశ్వరబ్రోవవు॥ ఇప్పుడుగాకింకెప్పు

ముఖారి.

కందర్పశతకోటిసుందరుడగు శ్రీమదిందిరాపతిసత్యము। పల్లవి॥
మందస్మితదివ్యసుందరముఖశ్రీ సుందరీమణిసత్యము॥అను
పరమేష్ఠి ప్రముఖచిద్రూపజీవకోటులరుదారగసత్యము। నిరతమ
చ్యుతపరతంత్రులై శ్రీవిధి హరులుండుటసత్యము॥౧॥
విమలవిజ్ఞానసుఖస్వరూపముతో శ్రీ విష్ణుదుండుటసత్యము। కమని
య్యకళ్యాణగుణపూర్ణుడగుచు శ్రీకాంతుడొప్పుటసత్యము॥౨॥

జగదుద్భవస్థితి సంహారక్రీడ శ్రీసఖుఁడుసల్పుటసత్యము। భగవంతుఁడఖిలాంతర్యామియగుచు తాభాసిల్లుటసత్యము॥ ౪॥

వేదవేదాంతసచ్ఛాస్త్రసద్భావము విశ్వమందుసత్యము। వేదవేద్యుఁడగువిష్ణులీలాశుభవేషచర్యలుసత్యము॥ ౫॥

పదపడి శ్రీహరిపదభక్తులానంద పదముఁజేరుటసత్యము। మదివిష్ణుదలచనిమత్తులుయముబాధ తుదిఁబొందుటసత్యము॥ ౬॥

హరిమహిమార్ణవమబ్జసంభవముఖ్యు లెరుఁగలేనిదిసత్యము। హరిపదభక్తిధ్యానముకంటెభాగ్యమిద్ధరలేనిదిసత్యము॥ ౭॥

శ్రీధరుఁడగు విష్ణు చేప్రసు శ్రీరంగ నాథుఁడగుటసత్యము। నాథహరేజగన్నాథహరేయన్న బాధదప్పుటసత్యము॥ ౮॥

రాగం.

మంగళహారతులివ్వరేదివ్యాంఘ్రునకు। మంగళసద్మసకంగజకోటిశుభాంగునకు॥ మం॥ పల్లవి॥

శంగదభంగతరంగసుధార్ణవ మంగళమందిరసంగునకార్తివి భంజనకరిమాతంగకేసరికిరంగపురస్థసుఖాంగవినోదికి॥ మం॥

అతులితజవబలలలితవిహంగతురంగునకు। అనవరతాశ్రితవిద్వద్యోగిహృదంబుజసంగునకు। శ్రితసత్త్వదసద్విత్తరణునకు విధిశితికంఠాద్యభినుతపదయుతునకు నుతగుణునకుసన్నుత బలునకుపోషిత హితునకు కరధృతమందరునకు॥ మం॥ ౧॥

ప్రకటితనిఖిలనిగమ నికరాంతభాసునకు। చంచత్సకలభువనభవరక్షణవిలయవిలాసునకు। శుకశౌనకసనకసనందనహృద్వికచాంభోరుహసుఖగేహునకత్యకలంకేందుసుముఖునకు ఖరబకవికటశకటదుర్ఘ

టవనవహ్నికి॥మంగళహారతులివ్వరెదివ్యాంఘ్రునకు॥౨॥

అభినవజలధర సుందరునకుమురవైరికి । సంతతశుభయమునాతట విలసత్పులినవిహారికి । త్రిభువనశుభదునకభయ ప్రదునకునిభరాడ్వరదునకభిమతసుఖసద్విభవస్థితునకువిశ్వశరణ్యునకభవునకభయునకఖిల ప్రభునకు॥మం॥

నవరోజు రాగం.

శ్రీశహరేమాంపాహియనగనిదిచెవిదూరనిదేమోయీ। నీసుఖశక్తి జ్ఞానైశ్వర్యములాసించముపోవోయీ॥పల్లవి॥

రమణియ్యాంఘ్రులవెలసిన మంజీరములిమ్మని యడుగములే । కమలోదరయుష్మత్కటివిలసితకనకాంబరమడుగములే॥౨॥

మొలనలరిన మేఖల చిరుఘంటలచెలిమిని యాచింపములే తళతళమెరసెడి కౌస్తుభ మిమ్మనిధరసాగిలిమ్రొక్కములే॥౩॥

హాటకరత్నకిరీటహారములు వాటంబనికోరములే । ఘోటకవదనపరేశుడవనిధన కోటులునినువేడములే॥౪॥

సలవితదధ్యోదన పుళిహోరములలరుచుయాచింపములే । తలకక చక్కెరపొంగలిదెమ్మనితడయకకామింపములే॥౫॥

సదమలరంగస్థలనాయకనీపదదర్శన విభవమును । వదలకనొసగిన చాలునుఫణిగిరివరదదయాకరదయను॥ శ్రీశహరేమాంపాహి॥

యమునాకళ్యాణి.

సారసభవవర్ణిత పదసారపయిటురార॥పల్లవి॥

కోరితినినుచేరరనను శ్రీరఘుకులవీర॥అనుపల్లవి॥

అనయమునినువినయంబునమనవిసేయలేదా । కనికరముననను బ్రోవ

సుకరుణనీకురాదా ॥ సాగసభవవర్ణితపదసారస యిటురారా ॥ ౧॥
మందరధరకుందరదన బృందావనవాస । డెంచముముదమెుందగద యుజెందింపుము శ్రీశ॥ సా॥ ౨॥
ఏలరబతిమాలిననన్నేలవుగోపాల । జాలములికమానరశుభశీలక్రపువిఫాల॥ సా॥ ౩॥
శేషాచలపోషకమణిభూషరంగవాస । పోషితహిత భువనాధిప దోషాచరనాశ॥ సా॥ ౪॥

రాగం.

నిత్య శ్రీవిష్ణ్వంఘ్రులాస్తి। మాకునిత్యశ్రీవైకుంఠమాస్తి। పల్లవి॥
నిత్యధ్యానానందమాస్తి ।మాకునిత్యశ్రీ అనుపల్లవి॥
అత్యంత ధనమణివస్తువాహనభూములాస్తిగానెంచుదురసిరమదిమెంచ॥ ౧॥
హరిచరితామృతమాస్తిశ్రీకరకృష్ణభక్తిమాకాస్తి । హరివిరహితసఖ్యమాస్తిగాదది ఘోరతరనిరయప్రాప్తికరుదగుమార్గము॥ ౨॥
హరిదాససాంగత్యమ్మాస్తి। రంగపురపతిస్మరణమాకాస్తి । నిరుపమాచ్యుతనామస్మరణ చింతననృత్య హరికీర్తన ధ్యానవరవైభవంబాస్తి॥ నిత్యశ్రీ॥

ఆనందభైరవి. జంపెతాళం.

ప్రత్యేకదాశ్రీహృదీశం। పల్లవి॥
ప్రక్షీణకలుషసద్భక్తహృద్వాసం॥ అనుపల్లవి॥
ఘోరతరభవసింధుతారణమనంతం భూరికారుణ్య రసపూర్ణ కామతిశాంతం॥ ౧॥

సాక్షాన్మనోజశత సౌందర్యభాసం । పక్షీంద్రగమన మరిభంజ నోల్లాసం॥౨॥

వరరంగపురచారుతరనిలయదీప్తం । పరమయోగీంద్రహృత్పద్మప ద్మాప్తం॥౩॥

బంగాళవరాళి రాగము.

ప్రవిశ చేతోభవహరమనంతం । పల్లవి॥

ప్రకటనిగమాద్రిశిఖరస్థమిత్రం।సకలమునివినుతశుభకరచరిత్రం॥అ॥

మృదుమధురవచన మభినవఘనాంగం । మదకలితసురవిమతమదవి భంగం॥౧॥

అతివితథవిషయ సుఖమపనయస్వ । హరిమనఘమాలపితుమభిగమ స్వ॥౨॥

వరదమనుభజరంగపురవరస్థం । దరహసితవదనమతిహితమనస్థం ప్రవిశ చేతో॥

ముఖారి.

గోపవధూతుల్యులు । శ్రీమద్గోపగోపీ వల్లభభృత్యులు ॥పల్లవి॥

ప్రవిమలద్వైత కుచద్వయయుక్తులు పరమదయాన్వితులు। అ॥ గో॥

నవవిధభక్తి భూషాంబరధారులునారాయణాసక్తులు॥౧॥

హరిచరితామృతరసమధురాధరులచ్యుతార్పితచిత్తులు। హరివిరహ వ్యాకులత్వపులాత్మేశపరిరంభ ణోత్సాహులు॥౨॥

నరహరిసూక్ష్మతత్వజ్ఞానమధ్యులు । హరిగీతపరవశులు। హరిగుణ గణమణిహారాద్యలంకారులాశ్రితపరిపోషులు॥౩॥

అతులసద్గృహబంధువిత్తాదివిరహితులచ్యుతరతికాములు । సతత
శ్రీకృష్ణసత్సౌందర్యవీక్షణాసక్తులసత్స్వాంతులు॥౪॥

రాసకేళీసక్తవాసుదేవధ్యానరమ్యనాట్యశీలులు। భాసురతరరంగ
వాససేవకశేషదాసపోషణశీలురు॥గోపవధూ॥౫॥

మారువ.

పలికేవచూచేవ భాషించేవా నలినదళాక్షునాతో ।పల్లవి॥
తలచితలచియెంతో వలచివలచి మ్రొక్కిబలసహోదరనిన్ను బతిమా
లినగానిపలికే॥అను॥

బలశక్తిసద్గుణభవ్యసుఖజ్ఞానములుస్వాభావికమాటను। చెలువొంద
నిత్యసంపదలిట్లుగలదన్నకలిమిగర్వంబనగలిగినకులుకుచే॥పలి॥

అతికరుణాన్వితమతిభక్తవితతులనరసిబ్రోవవేమున్న। సతతశ్రీకర
రంగస్థాననిలయనీవేగతియనిశరణొందిఘనమతినమ్మిన॥పలికే॥

ముఖారిరాగం.

నమ్మితినమ్మితిర।పల్లవి॥ నావలపువ్యర్థమొనరింపకుర। నమ్మి॥అ॥
నెమ్మదిముద్దుమొగమ్మొకపరిజూపిసమ్మోదమొందింపర పదపద్మములు
జూపర।

మత్కృతఘోరపాతకమెడబాపర । సదమలకృపనన్నుగదిసిబ్రో
చితినని ముదమునభాషింపర॥౧॥

కరుణతోడనుజూడరమస్తకమున చర। ణాబ్జములుఁజేర్చర । నిగ్ర
హమునినెడబాయననుచుహస్తమురఘునతగబెట్టర॥౨॥

కరివరప్రహ్లాదులయేకృపతోడ నరసిబ్రోచితివటుల। సరసిజాక్ష
రంగస్థలవాసవడిసికరుణబ్రోవరనన్నిల॥

## ముఖారి.

అతికుటిలునికితవునిగుణరహితునిమతినెటువలచితివమ్మా ॥ప॥

సమ్మతిపడిబంగరుబొమ్మా॥అతి॥అను॥

హితమతివినుమత్పతివిదోషచరితుడితరములనకమ్మా। నామతిగో

నుహితుడతడమ్మా॥౧॥

జలచరరూపుండగుచుమహార్ణవజలములమునిగెనెచాలా। నీసరి

బోలునేగుణశీల॥౨॥

వేదోద్ధరణార్థముజలచరమై విజయముగొనెగదవమ్మా। నావిభునికీస

రియెవరమ్మా॥౩॥

నిలయమునడువడికులగోత్రములతనికివసునుతిలేవమ్మా సొంపలరినపు

రుషుడటమ్మా॥౪॥

అతివరొమేనిరువురమేనుభువిశాశ్వతదంపతులముసుమ్మీ నా

పతిజతవేరనుకొమ్మీ॥౫॥

సిరికరువగుటనుబలిదైత్యునిగనితిరిపెమువేడెగదమ్మా। సుందరివినుమ

తడేలమ్మా॥౬॥

సురపతిబ్రోవదలంచిపదత్రయధరణినిగొనుటెరుగవటే। శ్రీహరి

లీలలుదెలియవటే॥౭॥

విషధరతల్పగుడగుచుమహాసురివిషదుగ్ధముగొనెనమ్మా। దుర్విషయ

యుతుడతడనుకొమ్మా॥౮॥

పొలుపుగఫణిపతిశయనుండగుచునుపూతననణచెగదమ్మా। నాపు

రుషునికెవరీడమ్మా॥౯॥

అడవులకొండల నెండలఁదిరుగుచు నావులఁగాచెగదమ్మ। మెట్లాడఁబడికోరితివమ్మ॥౧౧॥

లలనరో కృష్ణాభక్తభావంబున సలిపినలీలలెట్టోటి నాచెలువుడువేల్పులమేటి॥ ౧౨॥

జలములనాడెడి వల్లవలలనలవలువలుదోంగిలెనమ్మ। ఏకులమున నివిగలవమ్మ ॥ ౧౩॥

వరదుడగుచు హరిచీరలొసగెనుటలు వనితలశుభభాగ్యంబే। వోగరి తరోమునివినుతంబే॥ ౧౪॥

అతనిపయిస్మృతిగలసినజన తతులడవులగలయుదురమ్మ। నాహిత భాషలువినవమ్మ॥ ౧౫॥

తరుచుగహరిదలచుచుమును లడవులతపములుసేతురెచాల। శ్రీకర మతులగుచునులీల॥ ౧౬॥

వనములకొండల నాకలములుదినివర్తించెనెశుకవాణి। సీమనసెటులగలసెనెవాని॥ ౧౭॥

వనితరో జనకాజ్ఞనువనివెలయుచుమునితతి బ్రోచెనెభామ। పెంపు సవినగదెయిదిలేమా॥ ౧౮॥

అనయము వనములమెలగెడిమర్కట గణములగలసెగదమ్మ। పావనశీలవుగదవమ్మ॥ ౧౯॥

వననిధిగట్టిదలంచిరయంబున వనచరతతిగొనెనమ్మ। రావణుభువినణచగదమ్మ॥ ౨౦॥

వనగతులగుదిగ్వసనుల భిక్షులవెనుకొనునటవుపూబోణి। మన్ననని వినుకళ్యాణి॥ ౨౧॥

ఘనమునిగణ హృత్కమలాంతస్థితుడనశ్రుత్యాదులవినవా| నీమన సుకుయోగ్యతకరువా|| ౨౨||

పటురథకరిఘోటకతతులుండగ పత్తులనెక్కగదమ్మ| వోకుటిలాలకవినవమ్మ|| ౨౩||

హరిశ్రీవిష్ణుడనంతుడు శ్రీమద్గరుడారోహణుడమ్మ| సుందరజితసుమశరుడమ్మ|| ౨౪||

అధమునితెరగునదాత్యముసేయుచు రథములుగడిపెనెతల్లి| యీవిధమేలనెతనువల్లి|| ౨౫||

తనపదకమలములనయమునమ్మిన ఘనులకువశ్యుడెశౌరి| నామనమువరించునెకోరి|| ౨౬||

చల్లనిచూపులకనకాంగివిహరి నల్లనివాడోయమ్మ| నాచల్లనిపలుకులుగొమ్మ|| ౨౭||

రామరొనాప్రాణేశుడుజలద శ్యామలసుందరుడమ్మ| నానోముల ఫలమతడమ్మ || ౨౮||

కలికిరొజగములుకడుపునగలహరి కౌఁగిటికబ్బునటమ్మ| యీచెలువునిమానగదమ్మ || ౨౯||

వరుడవ్యయుడీశ్వరుడగునా పతివరవీరాన్వితుడమ్మ| సుందరులకొదగువిభుడమ్మ|| ౩౦||

కటకటభువినుత్కట నీచంబగుకిటివేషముగానెమించి| నీవెటు గోరితి వావరించి|| ౩౧||

శ్రీహరియజ్ఞవరాహా కృతిగొని క్షితిరక్షించనెసుదతి |నీమోహాకముడుగవెపడతి|| ౩౨||

అప్పులబారలుచునాక క్రియనుండక ముప్పొకలజనునమ్మ। నీకప్పరు మదుదగ[illegible]మ్మ॥ ౩౩॥

జలనిధివెలయుచు భవసంతుయములుసలి పింపుచుపోషించు। యా చెలువునిబుద్ధివరించు॥ ౩౪॥

అతడతులోద్యగ్గభాతురమున నఖిలము్రమింగునెతరుణీ। నీజతక తడహుదెరమణీ॥ ౩౫॥

మగువరొసకలజగంబులు కడపటతగనిజకుక్షినిజేర్చుక పెంపగుకరు ణనుకడలేచుక॥ ౩౬॥

నరసింహాకృతిగలిగినపురుషుని తరుణులుమరుగుద్ధురటవె। కాంత రొనామనవినివినవే॥ ౩౭॥

పరువడిదుష్టాసురవరుబారిగొనిభక్తునిబ్రోచెనెనారీ। నిభరకృప తోడుతజేరి॥ ౩౮॥

నవ్వులకంటెశమించివరింపు మునారాయణుడెఘనుండు। శ్రీనారిరొ నీకువిభుండు॥ ౩౯॥

సరసుడు శ్రీరంగస్థలపతినినుచక్కగజూచెనటమ్మ। నాకరయగశ్రీ యసఖివమ్మ॥ ౪౦॥

కేదారగౌడరాగం అటచాపు

దేవహరెయనియాడరె॥ పల్లవి॥

సర్వదేవవరేణ్యుని[illegible]డరె॥ అను

గోవింద గోవిందశ్రీధర॥ గోపాలకృష్ణలక్ష్మీవర।

భావజజనకశుభాకర। శుభభావసద్భావదుభావపోషణశి వ॥ దే॥

నందయశోదానందన। నతమునిసందోహచందన॥

బృందారకబృందవందన। పరిపూర్ణకృపాణాపనినాయవిరహిత॥
పంచవిశిఖకోటిసుందర। పద్మలోచనధృతమందర॥
చంచద్విభూషసత్కంధర। వాత్సల్యసౌశీల్యసౌలభ్యమాల్యోజ్వలదే
మదశిఖిబర్హవిభూషణ। మానినివర్గహృత్తోషణ॥
సమలశుభమంజుభాషణ। సౌజన్యకారుణ్యావరేణ్యాసన్మాన్యేశ॥ దే॥
రంగస్థలస్థశ్రీకేశవ। శృంగారతరవల్లవీధవ సంగ
శూన్యావనమాధవచారురంగదభంగతరంగంగేశస్థ॥ దేవహరే॥

శంకరాభరణం ఆది.

ప్రసాదమభికాంక్షే। యుష్మత్ప్రసాదమభికాంక్షే॥ పల్లవి॥
ప్రసన్న సుందరహాసన్ముఖ శ్రీరసాహృదయనాథసార రూపగ
త్రిసత్యమునిమానసస్థపరమప్రశస్తపదపద్మ సంభవస్తుత॥౧
కవీంద్రనుతపదభవాబ్ధితారణభవాబ్జభవవరనవాబ్జలోచన సువర్ణ
భూషణసువేషగోపీధవావ్యయాచ్యుతదివాకరాన్వయ॥ ప్ర॥౨
విస్రమతారకజనార్దనాఖిల మునీంద్రహృత్ప్రియ। మనోరథప్రదన
నందనస్తుతఘనాఘనాంగ సుజనావనోత్సుకమనోజ్ఞసుచరిత॥ ప్ర॥౩
బలానుజాంబరజలప్రముఖనిలయలాలితాధరవిలాసవిక్రమకళాభిశోభి
తబలాంతకార్చితసులక్షణాన్విత ఫలప్రదాయక॥ ౪॥
మురాసురాంతక సురేంద్రతాపసశరణ్యరంగనగరీ విరాజితకరీంద్ర
పోషణసురాంతకాంతక వరేణ్యాపాలయధరామరావన॥ ప్రసా॥౫

రాగము.

పాదారవిందములకు ప్రణతియొనరింప॥ పల్లవి
వేదాంతవేద్యుడౌశ్రీవిష్ణుదేవస్రద్రమ్య॥ పాదార॥అనుపల్లవి॥

పరమయోగీంద్రచిత్తపద్మకర్ణికలమెరయు॥ పాదా॥ ౧

ప్రకటకాళిదర్పోదగ్రఫణములన్నృత్యమాడు॥ పా॥ ౨

అక్షీణభక్తితో శ్రీలక్ష్మీభూకాంతలొత్తు॥ పా॥ ౩

లలితపద్మాంకుశాదిలక్షణలక్షితమౌ॥ పా॥ ౪

రాగవిగహితయోగిభాగధేయములైన॥ పా॥ ౫

మునిసిద్ధభక్తులాత్మ మోహించిముద్దులాడు॥ పా॥ ౬

నాథ శ్రీనాథ నెరనమ్మితినిన్నటంచు॥ పా॥ ౭

అతిఘోరతరపాపాన్వితుడ బ్రోవుమటంచు॥ పా॥

శేషసేవకపోష శ్రీరంగనాథయని॥ పాదారవిందములకు॥

రేగుప్తి ఆది.

మోసముసేయవద్దండీ॥ పల్లవి॥

నీదాసులదాసుడనండీ॥ మోస॥ అను॥

ఆసించినినుతమి డాసినచెలిముక్కు గోసివాలిఁబొంచి వేసికారడవికి

డీసిభూసుతనతిగాసిచేసియెడ బాసివహ్నినిచార జేసిరంగస్థానవా

సమొనచిన్నబ కాళించిసఖినెడజేసియాసతి భూప్రవేశముసేయగ

నాసగన్గొనినట్లు॥ మో॥ ౧

మించిపాలివ్వదలంచిన బోటిని ద్రుంచివెన్నలు దొంగిలించిచీరలుద్రు

చ్చి లించిగీతముగా వించి గోపికలర ప్పించివారల కౌగిలించిరతుల

గర గించిసుఖాబ్ధిని ముంచి మోహముగలిగించి మానములుహరిం

చిగన్నడకత పించినిన్నువిడద కించి చయ్యనగను పించి వారలలాలిం

చి రాసముగా వించిపొమ్మనినట్లు॥ మో॥ ౨

నందనంద నగోవిం కేశవముచి కుందవరద శ్రీమదిందిరాధిపభక్త

బృందచందనసొంపు చెందరమ్మనిదీన బృందముచేతఁ బొనందుడ వైభవబంధమ్ము ద్రుంచిసొం పొందనిత్యా నందసుందరపద మందుచెంద జేసిన యట్లు చెందింప జేయుము॥ హొసముసేయవద్దండీ॥

ముఖారి.

అనయముసీయం దెహృదయమమరగూర్పుము॥ పల్లవి॥

సెందుకనికరముననీస్మరణగలుగ జేయుము॥అన॥అనుపల్లవి

వనధినిలయుని న్నెమ్మనుదులుగొనగ జేయుము। నిన్నుఘనభక్తి సేవించువారిగలపి బ్రోవుము॥అన॥౧॥

సరసిజాక్షునీవె నిత్యసఖుడవెన్నను। బంధులరయగనస్థిరసఖ్యులవనిలోనను॥అన॥౨॥

దురితమతులహితమిద్ధరణిదొలగద్రోయుము। దివ్యతరవేషనవ్యభవగోరిదయనుచాయుము॥అన॥౩॥

వరరంగపురనివాసవాసవావన। శేషగిరిదాసవరదభవశరధి తారణ॥అ

ముఖారి ఆది.

జగతినచ్యుతాంఘ్రిభటులెచక్రవర్తులు॥ పల్లవి॥

సర్వజగదధీశుగొలుచువారెసార్వభౌములు॥జగతి॥అనుప॥

దీటులేనిశ్రీతులసీకిరీటధారులు పొందుసాటిలేనిసంగహీనశస్త్రధారులు॥జగతి॥౨॥

కామాదిశాత్రవగాత్రఖండనోగ్రులు మేఘశ్యామాసక్తచిత్తముఖ్యసైన్యయుక్తులు॥జగతి॥౩॥

కృష్ణనామశ్రవణరత్నకుండలాఢ్యులు।శ్రీవిష్ణుచారిత్రామృతపానవిభవభోగ్యులు॥జగతి॥౪॥

నలినాక్షమాలాదిరత్నకలితహారులు నవ్య జలజాక్షసద్విజయమధు రచారుభాషులు॥ జగతి॥౪॥

అనుపమవైరాగ్యభాగ్యధనవిశేషులు దేవ గణవంద్యులెందెదురు లేనిఘనుని దాసులు॥ జగతి॥౫॥

దాసచరణరేణుగంధభాసురాంగులు రంగవాసభక్తశేషగిరిదాసపో షులు॥ జగతినచ్యుతాం॥౬॥

కేదారిగౌళ ఆది.

యముడెందుగానమనియననేల॥ పల్లవి॥

యముడే శ్రీవిష్ణుడుసందేహమేల॥యము॥ అనుప॥

నమ్మివిభీషణునకభయమ్మొసగెన్|నమ్మనిరావణునిభువినాశమ్మొ సగెన్॥౧॥

నమ్మినపార్థునకుసారథ్యమొసగెన్ | నమ్మనిదుర్యోధనుహత మ్మొసగెన్॥౨॥

హితుడైన సుగ్రీవునకుహితమ్మొసగెన్ | హితబుద్ధిలేనివాలినిక్షత మ్మొసగెన్॥౩॥

యిష్టమతిగవియకుబ్జకిష్టమిచ్చెన్ | దుష్టని త్రయా తాటకనుధృతిని ద్రుంచెన్॥౪॥

విమలభక్తినాల్పగుహునివిశ్వసించెన్ | విమతుడౌమారీచునడవివె సవధించెన్॥౫॥

ఘనమునియజ్ఞముబ్రోచివినుతిగాంచెన్| ఘనభక్తిలేనిసుబాహునవనిన డంచెన్॥౬॥

చేరినయక్రూరునకుక్షేమమిచ్చెన్|క్రూరుడైనశతధన్వనిక్రొవ్వడం చెన్॥౭॥

శ్రీతుడైనకుచేలునకు సిరినొసంగెగ। శ్రీతుడుగానిశిశుపాలునకుమృ

త్యొసంగెగ॥౮॥

పాడినగజేంద్రునకుబంధువయ్యెగ । పాడనిమకరికి దండపాణియ

య్యెగ॥౯॥

తలచినప్రహ్లాదునకుదైవమయ్యెగ। ఖలుడైనహేమకశిపునకుకాలుడ

య్యెగ॥౧౦॥

బుద్ధిగల్గునుద్ధవునకుబుద్ధినిచ్చెగ।బుద్ధిలేనికంసునకుయుద్ధమిచ్చెగ॥౧౧

ధరణిశేషదాసునకుదోషహరణుడయ్యెగ। దురితులకురంగపతిదూ

రుడయ్యెగ॥౧౨॥

రాగం.

సాక్షాన్మన్మథరూపముసాక్షాత్కారమొనర్చి। పల్లవి॥

పక్షీంద్రధ్వజరక్షింపుముశ్రీలక్ష్మీయుతముగవచ్చి॥ సా॥ అనుప॥

పరమపురుష నారాయణ కేశవ పద్మనాభగోవింద । పురుషోత్తమ

దామోదర శ్రీధరపూర్ణానందముకుంద॥ సా॥౧॥

అభ్రశ్యామలతనుగతఘనతటిదంబర శ్రీగోపాల। విభ్రాజితకనకాం

గదకుండలవినుతచారుశీల ॥సా॥ ౨॥

నలిననయనభవదంఘ్రియుగధ్యానము విడువకగలిగించి । చెలిమి

వెలయమదిగనుపడు మనయముచిత్తంబునదయబెంచి॥ సా॥ ౩॥

అమితఘోరదురితాత్మకుడనినీవాగ్రహమాత్మనుబూని । యమరా

డ్దూతలవశమొనరింపకుకమలనేత్రకృపమాని॥ సా॥ ౪॥

భవదియాంఘ్రిసరోరుహయుగసద్భక్తావళులహితంబు। భవబంధ

విమోచననాశౌసగుముపాయకనికనిరతంబు॥ సా॥ ౫॥

శరణుశరణు కరివరదదయార్ణవ నెరనమ్మితినిన్ను। వరదకృష్ణ పాలింపుమురంగనివాస దేవనన్ను॥సౌ॥౬

మధ్యమావతి ఆది.

అతిసుఖకలితముమాయూరు।

హరిభటసదనముమాయూరు॥పల్లవి॥

స్మృతిసంభవవిరహితసత్పదమదికృతపుణ్యులుమదిగోరుదురాత్మల।

సతి॥అనుపల్లవి॥

నిరుపమశుభదముమాయూరు విరజాన్వితమగుమాయూరు । హరి శ్రీతరుణులకప్రాకృతసుందరమందిర మనధరనుతికెక్కుచు॥సతి॥౧॥

మణిమయలసితముమాయూరు। మునిగణవంద్యముమాయూరు అనయముకృష్ణసదావిలతచిత్తులకనుగుణ్యానుచారమాయూరు॥

కనవినచోద్యముమాయూరు। ఖలులకుతెలియదుమాయూరు। ఇనశశివహ్నులదీప్తులెరుంగకఘనరంగేశ్వరుకళశేమించును॥అతిసుఖ॥౨॥

కాంబోది జంపె.

శ్రీమదభినవఘనశ్యామసుందరదేహ దామోదరానంతశైత్యగణనివారణ॥పల్లవి॥

కామజనకముకుంద కళ్యాణగుణబృంద తామరసనేత్రసంతాపనిగ్రహనిపుణ॥శ్రీ॥అనుప॥

శ్రీవల్లభానంతగోవింద పద్మభవభావితాంఘ్రిసరోజభవసంచయవిరామ । గోవర్ధనోద్ధరణభావభవ భావభవభావజాంతకవినుతపరమమంగళచరిత॥౧॥

లలితమణిమయకుండలస్ఫురద్రుచినిచయకలితముకురకపోలఘనయో

గివరపాల| జలజనాభ ఫణీంద్రశయనకౌస్తుభభూషకలవేణురవరసిక కలభసురుచిరగమన॥లలి॥౨

శరదిందుసమవదన వరరంగపురసదనసరస సుందరహాసకరివరా తిఽవిదళన| శరధిమందిర శేషగిరి భక్తపరిపోషపరిపంథికులశోషభవ్య పదశుభభూష ॥లలిత॥ ౩

కమాసు.

పాలితనతహితభరితేరమా| పరమవ సురనుత ॥ పల్లవి॥

కాలజలదఘన కాయదురితచయ కాలమేఘగురుతరజవనపవన॥పా ప్రకటదనుజభటపటుబలవిదళననిపుణ ॥కృష్ణ॥ భావితచరణసరోరుహ భవ్యగుణాఢ్య | సకలసుజననికరకమలదినకరచారు చంద్రలసన్ముఖసు ఖకర ॥పాలి॥ సవనఫలదకవినివహావినుత జగదీశ ॥శ్రీశ॥ సన్మునిహృ దయనివాసశుభదరహాస । మృదుపదకలితఝుళంఝుళనూపుర మోహ నాంగసరసిజభవభవవర॥ పాలి॥

నిరసితఫణిమదఫణివరశయన విలాస| ఈశ| నిర్మలకలశపయోధని కేతనభాస| కరివరదాచ్యుత॥పాలిత॥

రాగం.

పాదారవిందములకు ప్రణతియొనరించెద॥పల్లవి॥

శ్రీదములైసరసీరుహహలకులిశాదిలసద్రేఖాంకితంబులౌ॥పా॥ అను సనకసనందనమునివరచుంబితఘనకిసలయప్రఖ్యములైదనరిన ॥పా అనుపమనిజభక్తాంతరంగపావనవనజాతస్ఫురితములగునీ॥ పాదా ౩ నిరుపమ శేషాచలదాసార్చితవరలక్ష్మీకరకలితములగునీ ॥పాదా రవిందములకుప్రణుతియొనరించెద॥౪

రాగం.

జయజయ శ్రీరమణ కేశవ జయవిద్యాభరణ॥పల్లవి॥

జయజయ మృదుచరణ। బ్రోవుము జయకళ్యాణగుణ॥అనుప॥

నీవు జనించుటను। మందను నెలకొనెముందగను। నీవల్ల భిల క్ష్మీ। సుజనుల దీవన జెందగను॥౧॥

నీవెడ ప్రాణములు। తమినిడెనీ వారిటు దిశలు। పాయక వెద కెదరు। చూపుము భవదియ్యాంఘ్రులను॥౨॥

కమలోదరరుచుల। ప్రముచ్చిలగల దృగ్జాలములు। రమణులమగుమమ్ము గనుగొని రక్షింపగదమ్మ॥౩॥

వెలలొల్ల కనిన్ను। వలచిన వెలదులమగుమమ్ము। నిలనిటు నొప్పించు। టిదివధియించుటగాదటర॥౪॥

వరవిషజలములను। వ్యాళాసుర వృష్ట్యాదులను। ధరమము బ్రదికించి। మన్మథశరహతి గ్రుంపకుర॥౫॥

సకలాత్మలలోన। వెలసిన సాక్షి విఖగయాన। సుకవిస్తుతవినుమీ। గోపీసుతుడవు గావు సుమీ॥౬॥

నినువిధి వేడగను। జగముల నెనరున బ్రోవగను। ఘనయదుకుల మునను। కలిగిన ఘనుడవు దలవగను॥౭॥

నతులకు హితమగను। పటుసంసృతిభయమణగగను। అతులిత శ్రీకరమై కామదమగు కరనలినమును॥౮॥

మానుస్తకతలము। లందిడి మన్ననతో గనుము। నీమముతో డతను। దలతుము నీగుణగణములను॥౯॥

సలఖితరంగేశ। శేషాచలపటుభవనాశ। జలజభవాధ్యక్ష। సుందర జలజసమానాక్ష॥౧౦॥

భైరవిరాగం.

తప్పేమిగలదు నాయందు॥పల్లవి॥

విప్పి చెప్పరతప్పునీయందు ॥అనుప॥

చెప్పనలవిగానిగొప్పమాయను ద్రోచితప్పులుశేయించి నొప్పించుచున్నావు॥౧॥

పరుడవనాదిసఖుడవు । నన్ను పరిభవమొందింపదగవు । నిరతమప్రాకృతనిత్యసౌఖ్యముగల్గిధరనన్ను బహుదుఃఖితప్రశేసితివహహ ॥౨॥

ధరణిబుట్టెదననియంటినా। పాపతతులోనచెడదననియంటినా।విరివిగబలశక్తివిజ్ఞానయుతుడవైకరుణవిడిచినన్నుగాసిబెట్టగనేల॥౩॥

దీనుడనస్వతంత్రుడను । యోగిధ్యానగమ్యుడవునీవిలను । మానకనీకిచ్చలేనికర్మంబులబూని నేసేయగలేను స్వతంత్రించి॥౪॥

దేవనీప్రేరణవలన । నేగావింతునే క్రియలైననీవుస్వతంత్రుడ వైన స్వతంత్రుడభావజాంతకనుతబాధింప నెంచకు॥౫॥

నను క్రీడలాడించుపతివి । గంగనివాసుడవునిత్యసుఖివి । ననుబ్రోవకున్న కాఠిన్యశీలుడవనినినుభువిచాటింతునిక్క మీపంతము॥ తప్పేమిగలదునాయందు॥

ఏమిరానీసత్ప్రభుత్వము। పల్లవి॥

మహానుభావ ఏమిరానీసత్ప్రభుత్వము॥అనుప॥

ఎంతమంచి విచార్యమాణమొప్రేమనేకాంతమునలక్ష్మీభామవైన నువిన్నవించవో॥ ఏ॥

నిన్నెరుంగని మూఢకోటికినిత్యభక్ష్యాజ్యాన్నభోజ్యమునిన్ను దెలిసిన వారికొకపరినిరభికారవుకూటితిండి॥ఏమి॥ ౧॥

అందలాలశ్వములుదుర్జనబృందములకే వేళహరి గోవిందయనుచు దలంచువారలు క్రిందనడుగిడిసంచరించుట॥ఏమి॥ ౨॥

*దిట్టముగురత్నంపుమేడలమిట్టిపడుచు నుకుజనులుండగ। దిట్టముగనిన్ను గొలుచువారికి చుట్టుగుడిశలుధరణికరువట॥ఏ॥ ౩॥

ఇష్టముగనిన్నాత్మ దలచనిదుష్టమతులకు నిష్టసంపదలిష్టముగనిన్ను గొలుచువారికి గష్టములపైకష్టదశలట॥ఏ॥ ౪॥

నిన్నుబొగడనిదుర్మదాంధులసన్నుతింతురశేషజనములు। నిన్నుబొగడెడిసజ్జనంబులనిందసేయుచునపహసింతురు॥ ఏ॥ ౫॥

వాసిగనుదుశ్చిత్తులకు సద్వస్త్రభూషణతతులు రంగనివాసనీసద్భక్తకోటికివస్త్రహీనతగలిగియుండుట॥ ఏ॥ ౬॥

## ముఖారి.

నమ్మితినమ్మితిర। నావలపువ్యర్థమ్మొనరింపకుర॥ పల్లవి॥

నెమ్మదిముద్దుమొగమ్మొకపరిజూపిసమ్మోదమొందింపర॥ అను ప॥

పదపద్మములుజూపగ మత్కృతఘోరపాతకమెడబాపర।
సదమలకృపనన్నుగదసిబ్రోచితినినిముదమునభాషింపర॥నమ్మి॥౧

కరుణతోడనుజూడర। మస్తకమునచరణాబ్జములుజేచర।
నిరతమునిన్నెడబాయననుచుహస్తమురమునతగబెట్టర॥ నమ్మి॥ ౨

కరివరప్రహ్లాదుల నేకృపతోడనగసిబ్రోచితివటుల।
సరసిజాక్షరంగస్థలవాసవడిదాసికరుణబ్రోవరనన్నిల॥నమ్మి॥ ౩

గాళిబంధు-ఆది.

మతిదలంచువారు ధన్యులు, మతిదల్పకపోతెనొక్కరు॥ పల్లవి

సతతము శ్రీపతినుతపదకమలములతి భక్తినిహితమతిసేవించుచు॥మ॥

శ్రీవరఘననిభగాత్రా మునివరసేవిత నవ్యాంబుజనేత్ర।

దేవదేవపురుషోత్తమగుణగణభావజభావజబ్రోవుబ్రోవుమని॥ మతి॥౧

శరణాగతపరిపోషశుభకరశాశ్వతసన్మోహనవేష।

సరసిజభవభవహరిహయవల్లభగరిమనేలుమనిమరిమరిమ్రొక్కుచు॥మ

నిరుపమరంగపురీశకేశవనిర్మలతాపసహృద్వాస।

నిరసితఫణిమదశేషభటాధిపకరుణింపుముకరివరదహరేయని॥ మతి॥౩

ధన్యాసి- ఆది.

స్థిరసుఖపదమునకరుగదలంచిన శ్రీవిభునయముభజియించు। పల్లవి॥

నిరయములోబడిపొరలదలంచినపరకాంతలపైమనసుంచు॥ అనుప॥

భవజలనిధినితరింపదలంచిన నవసీతప్రియుమదినమ్ము।

భవజలనిధిబడిమునగదలంచినయువతీగృహధనములునమ్ము॥ స్థిర॥ ౧

హరిచరితమునిగతమువినగోరిన హరిపదభక్తులసేవించు।

దురితోక్తులువినిచెడమదినెంచినదుర్జనసఖ్యముగావించు॥ స్థిర॥ ౨

కరిపతివరదునిగాంచదలంచిన హరిహరిహరియనిమొరబెట్టు।

దురుసుదండనలనొందదలంచిన హరిదాసులవిహితమునెట్టు॥ స్థిర॥ ౩

శేషభటాధిపుదాస్యముగోరిన శ్రీరంగేశ్వరుమదినుంచు।

శేషతల్పగునిబాయన్వలచినపాషండులగనిహర్షించు॥ స్థిర॥ ౪

సురటిరాగం. అటతాళం.

రామయనినిన్ను వేడినందుకు రాదా యెనీకరుణా॥ పల్లవి॥

కామించి సీతనుకరినాటపులఁబ్రోచి

భామలదేలించుసామివిగనుక నే॥ అనుప॥ ౧

మున్నువిభీషణుడన్న పల్కులనాచ్చినిన్ను డగ్గరిమ్రొక్కగా।
మన్ననరక్షించుమమతోనాపైరాదా ।సన్నుతచరితనాకున్న దుర్దశయే
మో॥ ౨

రామసుందరఘనశ్యామహరేయనిరంజిల్లుసుమతులను।
ప్రేమవెలయనెట్లుప్రీతిగాచితిరోనీకేమినేనపకారమిలజేసితయయో॥
వరరంగపురవాసవరగణస్తుతనిన్ను నెరనమ్మినాడసుమీ। గురుతరకృ
పశేషగిరిదాసుఁబ్రోచినకరణి ప్రోవుముశ్రీకరమణిభూషణ॥ ౪

రాగం.

హరికృపగలుగుటెన్నటికో॥ పల్లవి

శ్రీమత్కరివరవరదునిగాంచుటెన్నటికో॥ అనుప॥౧

కృష్ణసద్భక్తియెన్నటికో। శ్రీ.విష్ణుపదధ్యానవిభవమెన్నటికో॥ ౧

స్థిరమతినగుటయెన్నటికో।
కామాద్యరిషట్కమవలీలనణచుటెన్నటికో॥ ౩

భగవదాసక్తియెన్నటికో। శ్రీ।భగవద్దాసులగూడిపాడుటెన్నటికో॥
వైరాగ్యభాగ్యమెన్నటికో।యిరువ।దారింటివానినిజేరుటెన్నటికో
విడువనిచెలిమియెన్నటికో।శ్రీ।విభుతో నాస్థితివిన్నవించుటెన్నటికో
మరులొందిబిలుచుటెన్నటికో । శ్రీహరిపదాబ్జములుముద్దాడుటె
న్నటికో॥ ౭

పరమునివలచుకొన్నటికో। రంగ।పురపతిదాస్యముబూనుకొన్నటికో॥ హరి॥ ౮

విరాళి.

అగణితకల్యాణగుణపరిపూర్ణుడ వప్రమేయుడవీవు॥ పల్లవి

అగణితఘోరదుర్దాంత మహాపాతకాన్వితాత్ముడనేను॥ అను॥

వరమత్స్యకమఠ నృహర్యాదిబహురూపధరుడవీశుడవీవు।
ధరగల్గుసకలయోనులబుట్టిచచ్చుచుపొరలునీచుడనేను॥ ౧

వనధిమధ్యమున శేషఫణితల్పమునవొప్పు ప్రభుడవీవు।
పనిబడిఘోరభవాంబుధిలోబడిమునుగుఖలుడనేను॥ ౨॥

పొందుగసకలయోగీంద్ర బృందారకవందితుండవునీవు।
మందరోద్ధరణగోవిందయుమ్మహీనతినిందితుండనునేను॥ ౩॥

నన్నుబ్రోవనీకంటెపరదైవమెవ్వరుఘనరంగపురనాథ।
చనువునవేడితిచక్కగదీర్చుముజనవంద్యనాబాధ॥

ఆనందభైరవి.

శ్రీరంగనాథదయావిధే॥పల్లవి॥

కుండలఖరకరమండలవికసితపండితగణహృత్పుండరీకచయ। శ్రీరం
సన్మునివినుతజగన్మోహనశుభచిన్మయవిగ్రహమన్మథమన్మథ॥ శ్రీరం
కుందరదనముచికుందవరదగోవిందయశోదానందసునందన॥ శ్రీరం॥
మదనజనక మునిహృదయ సదనశశివదనహరేదుర్మదరిపునిగ్రహ॥
రంగపురస్థశుభాంగదయార్ణవమంగళచరితపిశంగవసనధర ॥శ్రీ

శంకరాభరణం, ఆది.

కరుణబ్రోవదలచుకొపుడొకమలనాథుడు॥పల్లవి॥

నన్ను, విరివిగ పోషించు టెపుడో విశ్వమోహనుడు॥అనుప॥
అభయమిచ్చు టెపుడో నిత్య విభవదాయుడు । నిత్య
శుభ మొసంగు టెప్పుడో పరిశుద్ధభావుడు॥౧॥
చరణదాస్యమిచ్చు టెప్పుడో సాధుపోషుడు దివ్య
చరణముల్లను పరచు టెపుడో సత్యభాషుడు॥౨
సాక్షాత్కరించు టెపుడో సజ్జనాప్తుడు నన్ను
వీక్షించి భాషించు టెపుడో విష్ణుదేవుడు॥౩॥
చెలిమిజూపు టెపుడో రంగనిలయవాసుడు। పాద
ములు మస్తగా నిచ్చు టెపుడో మురవిదారుడు॥ ౪

ధన్యాసిరాగం. అట.

క్షణమైన నిను బాయని భాగ్యసౌఖ్యమీ క్షణమున గలిగింపుమీ॥ పల్లవి
ఫణిపతిపర్యంకమున నొప్పు నీస్వరూపము కృపదర్శింపుమీ। గోవింద॥అ॥
అనఘ తావకచరితామృతజలనిధినవగాహనము సేయుచు। నినుభజం
చెడిపుణ్యనిధుల దాస్యస్నేహమనుకూలమొనరింపుము।దయ బెంపుము॥
పరమపదప్రదభవభయమోచన గరుడవాహనవామన। వరరంగ
నాథనీవాడబ్రోవుము నన్ను పరిపంథిగణహరణ భటపాలన॥ క్షణమైన॥

మారువరాగం

ధనమదయౌవనగర్వోద్రేకము తన్ను లుడిసుటకు మూలంబు॥ పల్లవి
వనజదళాక్షుపదధ్యానామృతమున నవ్యయసుఖవిభవంబు॥ అను॥
హరిభక్తాగ్రేసరులకు మ్రొక్కని నరవర్గము నకు నరకంబు।
హరిభక్తాగ్రేసరసాంగత్యము హరికృపగలుగుటకహేతంబు॥ ౧

కరివరదునిశుభ చరితము విన్నసునిరుపమముక్తికిమూగఁడారిబు।
వరరంగేశ్వరచరణాబ్జద్వయమరుదుగఁదలచినభద్రంబు॥ ౨

కాంబోధి॥

లంచమండ్రిబ్రోచుటేమిమంచికార్యమె॥ పల్లవి
నీవులంచమాసించకకరుణించినదెవ్వరినాకాని॥లంచ॥అనుపల్లవి॥
విదురునిపాలించుటెల్ల విందుగావించినందుకె।
వదలకకుబ్జనేలుటవలసిశ్రీగంధమిచ్చినందుకె॥ లం॥
గంగదాటుటకె గుహునిపొంగివిశ్వసించుట।
గోపాంగనవరదుఁడవగుటనంగజకేళికెగాద॥ లం॥
విహగేంద్రునేలుటమిమ్ము వీఁపనమోసినందుకె।
అహిరాజునేలుటమీకునమరినపాన్పైనందుకె॥ లం॥
అలవిభీషణునిబ్రోచుటన్నమర్మముదెల్పుటకె।
చెలగిసుగ్రీవునేలుటసీతాన్వేషణముకెగాదా॥ లం॥
ధరణిపిజయుసారథ్యముధరణీభారమణగించుటకె।
అరుదుగాకుచేలుబ్రోచుటటుకులుమీకర్పించుటకె॥ లం॥
అంజనిపుత్రునేలుటయాలిజూచివచ్చుటకే
కుంజరేంద్రవరదశబరికోరిఫలములర్పించుటకె॥ లం
ఘనకృపశ్రీభూదేవులగనుటభార్యలయినందుకె।
మునులగారవించుటహృద్వనజములర్పించుటకె॥ లం॥
వరరంగవల్లభశేషగిరిదాసునాదరించుట।
శరణుశరణటంచుమిమ్మునరుగుజొచ్చినందుకెగాదా॥ లంచ॥

రాగం.

శ్రీతరుణిరో నేశ్రీరఘు రాముడ చేరిక వాటముదీయా వె ॥

నీవా తెగ తే నెలియా వె ॥ పల్లవి

ఖ్యాతిగ శ్రీరఘు రాముడ నై తెకోతుల జేరగ దోయి ।

ఘన సేతువా నగ్వ గదోయీ ॥ ౧

సారసపుష్ప సుంగంధిరో శ్రీపున్నా రాయణుడ నె బాలా ।

నీకురిమివిషువగజాల ।

నారాయణ దేవుడ వై తేనియుసిరధి జేరగదోయి ।

నను చేరవల దుపోవోయి ॥ ౨

సకలజ్ఞుడనవ్యయుడననంతుడ చారునుఖిశుక వాణీ ।

నినుగోరితిపల్లవ పాణీ ।

సకలజ్ఞుడ వై వెలసితివేనియు జానకి వెదుకగ నేల ।

మునిమానసనిలయసుశీలా ॥ ౩

లోకగురుండనుశ్రీకరదివ్య గుణాకరుండ నెకొమ్మ ।

ననుగైకొనుబంగరుబొమ్మ ।

లోకగురుడ వై తేనివసిష్ఠులునీ కేమగుదురువో స్వామి ।

భువనాకర్తవాదులి తేమి ॥ ౪

భువనములనుశ్రీగోపాలుండనపొగడొందుపుపూబోణి ।

మదపుష్పంధయసమ వేణి ।

భువిగోపాలుడ వైనను పశువులతవిని కావబోరాదా

ఘనతేరముర కీకలవాదా ॥ ౫

శ్యామలనీరదకోమలదేహుఁడ ప్రేమజూడుసొంపార।

నీనోముఫలముచేకూరఁగ।

శ్యామాంగుఁడవగుటెరిగియు గోపికలేమనివలచిరో నిన్ను।

మదికామింపకుమికనన్ను॥౬

నీరజముఖినే పాండవవరదుఁడ నీలఘనాలకఫాల।

ననునిదఁయఁజూచుటమేలా।

కూరిమి పాండవవరదుఁడవైతే తేరుగడపుమవలీల।

సమదారికదంబవిఫాలా॥౭

శ్రీకరలీలామయకృష్ణాఖ్యుఁడ చంపకగంధసుగంధి।

ననుచేరవెచారుపురంధ్రీ॥

శ్రీకరలీలలకృష్ణుఁడవైతే చీరలుదొంగిలవోయి।

నీచర్యలెరుంగనటోయి॥౮

అతిసుఖవిభవమెలపఁగనయోధ్యకుపతివైవెలసితిభామా।

ముఖజితశశారదసోమా।

అతిసుఖమలరనయోధ్యవసించిననడవులనుండుటెవారో।

తగనిడుములగుడుచుటెవారో॥౯

సరసిజగర్భాండములకధీశుఁడ నెరనమ్మితినినురాణీ।

సుందరతరపులినశ్రోణీ।

సరసిజగర్భాండములేలుచుబలితిరిపెము వేడఁగనేల।

శ్రీకరతరకాంచనచేల॥౧౦

కరివరదుఁడకుచగిరి పట్టిసంభ్రమమరుదుగఁజేయవెచానా।

నన్నరమరచేయకె జాణా॥౧౧

కరివరదుడవై తేతత్తరపడిబిరబిరపరుగిడవోయి।
నీబింకె మెరుంగనటోయి॥౧౨
సదమలధర్మవ్రతుడ కృతజ్ఞుడ సత్యసంధుడ నైరామా।
నీసరియెవ్వరెగుణధామా।
సదమలధర్మవ్రతుడవగుట నేముదితనడంచుట చేవ।
నిర్మోహింపిగదశుభభావ॥౧౩
కరుణాకరభాసురహృదయుండనుకానిపల్కులనబోకు।
శ్రీకాంతగాదోషముపోకు।
కరుణాకరహృదయుడవగుటనెతల్లిని పరశునతెగగానుల్ల।
మాకిరుదుగ దెలసునదెల్ల॥
వంచనలాడుచువంచింపకుననువంచననేరనెనారీ।
సైరించవేనన్నీ సారి।
వంచనలెరుగనివాడవగుటనేపొంచిశరంబరిబోసి।
కపిద్రుంచినదురవడినేసి॥౧౪
పావనమూర్తినిపద్మదళాక్షుడపాలింపవెనన్నేలి।
సంభ్రమమొదవగకడుజాళి।
పావనమూతుకలరై తేనెంగిలిపండ్లుభుజింతురెమించి
రిపుభంజనమేలనియెంచి॥౧౫
ఘనమతిగంగపుర్రీశుడననఘుడనెనరున కౌగిలియావే॥
చందనకర్దమముబుయావే।
చనువుననవ్వులకాడినపల్కులుమనముననిల్పకధీశ।
మన్నవనన్నేలుహృదీశ॥౧౬

ముఖారి.

హరిసత్కథలనాలకింపుమీ॥పల్లవి॥

ఘోరదురితౌఘములనెల్లద్రుంపుమీ॥హరి॥అనుప॥

వరదహరేయనియాడుమీ। శ్రీధరకృష్ణాచ్యుతయని పాడుమీ॥హరి॥

విష్ణుభక్తులనుసేవింపుమీ। గోవిందసద్భజనగావింపుమీ

దేవదేవునిభక్తిజేయుమీ। శ్రీదేవవరేణ్యునిగోరుమీ॥హరి॥

మదిలోనహరిభక్తిమానకు। దుర్మదసఖ్యమొనరింపబూనకు॥హరి॥

హరిరంగపతిగదలంచుమీ। శ్రీధరుడేముక్తిదుడనియెంచుమీ॥హరి॥

ముఖారి.

సొగసులుసేయబూనకుర। పల్లవి॥

స్వామిసొగసుగన్గానిభక్తిసొగిమ్రొక్కముర॥సొగసు॥ అను॥

ధనమున్నదనిత్రుళ్లబోకు। భక్తిధనములేకున్నదెబ్బలుముందుదాకు॥

హరిహరిహరియనుకొమ్ము॥శ్రీహరిసేవకులతోడనాట్లాడబొమ్ము॥సొ

వరరంగపతినాత్మనమ్ము శ్రీధరకృష్ణాయనిముదితగవేడుకొమ్ము॥సొగసు

శ్రీహరికీర్తనలు సంపూర్ణము.

